శ్రీ

# శ్రీ సరస్వతీ శతకము.

ప్రధాన రాజపోషకులు

మహారాజరాజశ్రీ

శ్రీ శ్రీ శ్రీ

## రాణి జగదీశ్వరమ్మ రావుగారు,

కపిలేశ్వరపురం ఎస్టేటు,

నూజవీడు, కృష్ణాజిల్లా.

శ్రీమత్పరదేవతాయైనమః.

# శ్రీ సరస్వతీ శతకము.

శ్రీ॥ సౌ॥ చేఁబ్రోలు సరస్వతీదేవి విరచితము

గవర్నెస్ (రాజభవనము)

మీర్జాపురంఎస్టేటు, నూజవీడు.

నూజవీడు శ్రీగౌరీప్రెస్సున ముద్రితము.

1931.

[వెల 0-2-0.

కామేశ్వర్యైనమః.

# ఉపోద్ఘాతము.

శతకములు భాషామహాదేవి కమూల్యములగు చిన్ని భూషణములు. భిన్నభిన్న విషయములుగల పద్యములొక్కచోఁజేరి యనేకకుసుమములు గలిసిన పూగుత్తులవలె నామోదసంధాయకములై యలరారుచుండును ఒకే కథాసంవిధానముగల కావ్యనాటకములలోవలెఁగాక శతకములలో విషయ

ము ప్రకృతినంతయు నొక్కమాఱు స్పృశింప నవకాశ మొ
సంగు చున్నది. శతకములు చిన్నగ్రంథములే యని కొందఱం
దురు. చూడవలసినది రసభారముగాని పుటలభారముగాదు.
స్త్రీలుధరించు భూషణములుగూడ నాయాస్థానములఁబట్టియుఁ
బరిసరాంగ సౌకర్యములఁ బట్టియుఁ బరిమాణమునందును,
విలువయందును, వస్తువునందును, భేదముగలిగి యుండును.
చిన్నదే యయినను మగరా ముక్కుఁబుడక, నిఖిలసీమంతినీ
జనమనోహర ముఖమండలములకుఁ దేజముఁగూర్చి యాహ్లాద
ము సంధించుచుండుట దినదినానుభవము. ఆయంగమునకది

య యర్ఘ్యభూషణము. సార్వభౌముని శిరోభాగమున వెలుంగు నవరత్నవిరాజితమకుటరాజము పరిమాణమునందును, విలువయందును, సౌందర్యమునందును, ఘనతయందును బ్రపంచమునందలి భూషణములలో నెల్లఁ బూర్వాభిగణ్యమైనది.

కాని దానినొక నాకమణి నాసాగ్రమున వ్రేలాడఁగట్టవలనగునా? నాసికదక్కునా? మకుటముదక్కునా?

కవితావిషయమున నవనవోన్మేషమగు ప్రతిభాశక్తియు రససమగ్రతయు ముఖ్యముగాఁ జూడవలసిన గుణములుగాని పాత్రము పెద్దదియా చిన్నదియా యని చూచుట యనవసర

ము. నిరుపయోగము. కొండంతయూఁకకన్నఁ జిట్టెపుగింజలు మేలని యెవ్వరంగీకరింపరు? అణుసమూహముచేఁ బ్రపంచ మును బిందుసందోహములచే మహోదధియు నేర్పడినవి. కు తుకముఁబెంచు శతకాది గ్రంధములచే సారస్వతప్రపంచము సముత్పన్నమైనది. ఎంతచిన్నదయైన నొకానొకయంగములేమి దేహమునకెట్లులోపమో శతకాంగములేకున్న సారస్వతమహా లక్ష్మికొకగొప్పలోపమే. తీక్ష్ణపద్ధతి నీతినిగఱపుటలోఁ గొన్ని యెడల నితరగ్రంధములకన్న శతకములు శతాధిక గుణాంచి తములని చెప్పనొప్పును.

శ్రీసరస్వతీపదముకుట శోభితమయిన యీగ్రంథము భక్తిప్రధానమయిన శతకము. కవయిత్రి ప్రతిభాప్రభావసంపన్నయు నాంధ్రామరాంగ్లేయభాషలలోఁ బాండిత్యమువహించిన ప్రౌఢయునగు శ్రీ. చేఁబ్రోలు సరస్వతీదేవిగారు.

వీరి విద్యాగురువులు బ్ర॥ వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు బి.ఏ. గారు. దేవిగారిగ్రంథము మాతృకను నాయొద్దకుఁబంపి యుపోద్ఘాతమును వ్రాయుఁడని బహువిధముల నర్థించి నాకమూల్యావకాశముఁ గలిగించిరి.

నూజవీడుపురనివాసినియు నున్నతవంశప్రభవయు నగు దేవిగారాంధ్రభాషయెడ ననురాగముగలిగి, పువ్వులదొరసాని యగు గులాబిపూవును విలాసముగ వహింప నలవాటుపడిన తనసుకుమారమనోహరహస్తములఁ గలము ధరించి గ్రంథరచనమునకు దొరకొనుట కేవలము ప్రశంసాపాత్రము. కవితారచన నారంభించి కొలఁదికాలమేయయినను దేవిగారిశైలి నాతికఠినమై, మృదుల మంజులభావాలంకారశోభితమై సరసమై విలసిల్లుచున్నది. పరుషదోషమున కించుకయుఁ దావొసంగక కేవలము వాడుకలోనుండి యందఱుఁ దెలిసిన మెత్తని చల్లని

లలితపుఁ బలుకులు కప్పురపుఁబలుకుల గేరుచు, సరస్వతీదేవి హస్తమున ముద్దులుగుఱియు రాచిలుకపలుకులవలె లోకానంద మొనరించుచుఁగాక. తనమనంబునఁగల కృతజ్ఞతతో, విద్యాధిదేవతయగు సరస్వతీదేవిని బ్రథమమునఁబూజించుట సముచితమనితలంచి యతులితామోదప్రదములగు చంపకోత్పలమాలలుఁ గంఠమున వైచి హృదయరాజీవమును జరణములకడ సమర్పించి భక్తితోఁ గల్యాణ కర్పూరహారతి యొసంగినది.

అరుగరాచినకాలఁదిని బహుమానమతిశయించు శ్రీచందనపుఁజెక్కవలెఁ బ్రతిపద్యము రసస్ఫురణముగలిగియున్నది. సద

వకాశము గలిగించి నిజపాత్రినాయకిని ప్రోత్సహించి గ్రంథ
రచనము సాగింపఁ జేసిన శ్రీరాజగోపాలముగారు పురుషప్రపం
చమున కలంకారప్రాయులు. వీరివంశము చేఁబ్రోలు సిరిపోగ్రి
లై వర్ధిల్లుఁగాక. ఈసరస్వతీదేవి విద్యాసరస్వతీదేవియై బహు
గ్రంథములురచించి యితోధికకీర్తి నార్జించునుగాక. కచ్ఛపీ వీ
ణానినాదమువలె దేవిగారి గ్రంథగాన మాంధ్రలోకమున
ననారతము ప్రతిధ్వనించుచు నాహ్లాదముఁ బెంచుఁగాక.

విద్యాశాఖాధికారులే పాఠ్యగ్రంథకథలో, యేమంగల
రంగనికత్తులకథలో పఠనీయములుగనుంచుటకుమాటిట్టె శ్రీ

రత్నములు రచించిన గ్రంథములు నియమించి కృతకృత్యులగు దురుగాక.

ఈశ్వరుఁడీ వధూవతంసమునకుఁ జిరాయురున్నతులు ప్రసాదించుఁగాక.

శైలీప్రదర్శనార్థమై నూఁజవపద్యము నుదహరించి యుపరమించుచున్నాఁడ.

ఉ. నీమృదుపాదపద్మముల నెమ్మదిఁదాల్చితి నీస్వరూప వి
ద్యామహితప్రచారముల నర్చనచేసితి నిన్నుఁబోలె సు

శ్రీమహిమంబులొప్పనొక చెల్వను సందియమేటికింక నీ
నామమెదాల్తు; నీకృపకు నాకొకలోపమె శ్రీసరస్వతీ!

డి. రాజశేఖరం,
కవిసింహ అవధానిపంచానన
వైస్ప్రెసిడెంటు తాలూకాబోర్డు
బ్రహ్మానందిసీ ముఖ్యసంపాదకులు.

ప్రొద్దటూరు,
కడపజిల్లా,
21—5—31.

శ్రీ ర స్తు.

# శ్రీ స ర స్వ తీ శ త క ము.

ఉ. శ్రీదయివారభాగ్యమును ♦ చెల్వగువిద్యయునిత్యశాంతియుఁ
భేదమొకింతలేక సిత ♦ నీరజవాసిని! భక్తకోటికిఁ
మోదముతోడనియ్యగల ♦ మూర్తినినీవనియెంచి యాత్మలో
పాదసరోజయుగ్మముల ♦ పైబడివేడెద శ్రీసరస్వతీ! 1

ఉ. భారతి! చంపకంబులును ♦ భవ్యముఁదై తగునుత్పలంబులున్
చేరిచి పూజసేయుటకు ♦ సిద్ధముచేసితి శుద్ధభక్తిమై
పారములేనినీకరుణ ♦ పైపయిఁజూపి కృతార్థఁజేయుమా
నేరుపుచాలదయ్యెనిఁక ♦ నీవశరణ్యము శ్రీసరస్వతీ! 2

చ. తలచినకార్యసాధనము ♦ తప్పకసేయుచునాదువాక్కునన్
పలుకఁదొసంగులేక వర ♦ పద్యగణంబులగూర్చి నవ్యమా
సలలితభావముల్ జెలగు ♦ శబ్దములన్ దగనిల్పిపొంగఁగా
చలిమలపుత్రినందనుని ♦ సన్నుతిజేసెద శ్రీసరస్వతీ! 3

చ. హారునకువానిరాణికిని ♦ నంచితభక్తిని మ్రొక్కి యాపయిన్
హారికినివానిరాణికిని ♦ నంబుజగర్భునకున్ బుధాళికిన్
కరములుమోడ్చి మ్రొక్కెదను ♦ కామితసంపదసౌఖ్యసంతతుల్
వరలఁగ బ్రోదిసేయుటకు ♦ వర్ణమయీ! సతి! శ్రీసరస్వతీ! 4

చ. సదమలవత్సలత్వమున ♦ శాస్త్రములందలి నీతిసారముల్
ముదమలరంగవిద్యలను ♦ భూతములై స్వప్రబోధవైఖరుల్
సదయతమీరఁగాఁ దెలుపు ♦ సద్గురునాథుని సుబ్బరాయునిన్
వదలకచిత్తమందునిచి ♦ ప్రస్తుతిచేసెద శ్రీసరస్వతీ! 5

చ. కవికులరాజకోటి పద ♦ కంజములన్ భజియింతుభక్తితో
నవరసభావకల్పనలు ♦ నాకనుదోపగజేసివేడ్క సి
ప్రవిమలనామరూపముల ♦ పల్మరుసన్నుతిజేయగావెసన్
కువలయమందుకీర్తినొడఁ ♦ గూర్పఁగఁగోరితి శ్రీసరస్వతీ! 6

చ. గురువులనెల్లచిత్తమున ♦ కోరిసుతించెద తల్లిదండ్రులన్
పరమగురుండనంబరగు ♦ భవ్యుని లక్ష్మినృసింహదేవునిన్
సరసకవిత్వసంపదలు ♦ సమ్మతిమీరగ జిహ్వనాటగన్
మతిమఱిసి స్తుతించెదను ♦ మన్ననఁగాంచుము శ్రీసరస్వతీ! 7

చ. నలువపడంతి! నమ్మితిని ♦ నాలుకపై వెసనిల్చిదిట్టవై
పలుకుదోసంగులేక రస ♦ వంతములై దొరలంగపద్యముల్
పలుకుమటంచు వేడితిని ♦ భారతి! మేలగుకీర్తికై తమున్
వెలువడజేయవమ్మ కరు ♦ ణించి కళావతి! శ్రీసరస్వతీ! 8

ఉ. మానకనాపయిన్ కరుణ ♦ మాటికిమాటికిజూపి ధర్మవి
జ్ఞానముగాంచఁగాఁదగిన ♦ శక్తిని సత్వరమిచ్చుచున్ గుణ
శ్రీనయబోధపద్ధతుల ♦ జెందుటకున్ సతమున్ భవత్కృపా
దానముసేయుమోజనని! ♦ తద్దయుగొల్చెద శ్రీసరస్వతీ! 9

ఉ. చల్లనిచూపులన్ బరపి ♦ శాంతగుణమ్ము ననుగ్రహించి సం
ఫుల్లవిలాసకేలలను ♦ బుఱ్ఱింగగఁ జేసినయుం బోకెంత నా
యుల్లమునందు జొన్పి ప్రియ ♦ మొప్పగ నన్నదనుంచి మేలుఁ రం
జిల్లభజింప బుద్ధివిక ♦ సింపఁగఁ జేయుము శ్రీసరస్వతీ! 10

చ. చిరతరభక్తి నాహృదయ ♦ సీమను నిన్ను భజింతు నెప్పుడున్
మఱిధైమదానగాను నిను ♦ నమ్మితి వేఱుగ నెంతచూచినన్
గరమనురక్తిబూని నను ♦ గాచెడివారలు వేరుగావునన్
గరుణదలిర్ప నన్నెపుడు ♦ గావుము తల్లిరో శ్రీసరస్వతీ! 11

చ. వినయముతోడ భక్తిపర ♦ వీఁ మనమందుననాటఁజేసి నే
మనవి యొనర్చుచుంటి వినుమా ♦ నను గావుము పెంపుగూర్పుమా
కనికరముంచుమా తెలుఁగు ♦ కైతముసందున నేర్పుసంగుమా
జనని! భజింతు నిన్నెపుడు ♦ సమ్మదమొప్పఁగ శ్రీసరస్వతీ! 12

ఉ. నిన్ను భజించుచుఁ సతము ♦ నీపదపద్మములాశ్రయించుచుఁ
జెన్నలరారనీగుణము ♦ నెమ్మనమందున జింతసేయుచుఁ
గ్రన్నన నీదు నామమని ♦ రంతరముఁ జపియించుచుఁ నినుఁ
సన్నుతిజేయుచుంటి నను ♦ సమ్మతిఁ బ్రోవుము శ్రీసరస్వతీ! 13

చ. కలియుగమందునీదుకృప ♦ గల్గినవారలు పండితోత్తముల్
నెలతరో! నీకృపారసము ♦ లేనిమనుష్యులువట్టిమందులై
మెలకువజెందలేరు పర ♦ మేష్ఠిమనోహరి! నిన్నుగొల్తు నా
కలవడజేయుమీరసమ ♦ యంబగుకైతము శ్రీసరస్వతీ! 14

చ. ఒకపరిపద్మసంభవుని ♦ యుత్తమపత్నిగఁ దోచుచుందు వీ
వొకపరి విష్ణువక్షమున ♦ నున్నతిజూపెదునాదిలక్ష్మివై
యొకపరిరుద్రురాణివయి ♦ యుందువు వెన్నఁగనీమతత్త్వముల్
సకలసురేశ్వరుల్ తెలియ ♦ జాలరునిక్కము శ్రీసరస్వతీ! 15

చ. సదమలభక్తినీచరణ ♦ సారసయుగ్మముఁగొల్చెదన్ జయ
ప్రదముగులీలనాసుతుల ♦ భర్తనురక్షణసేయుమానను
వదలకయాయురున్నతులు ♦ బాగుగనిచ్చియనుగ్రహించినీ
పదములగొల్చుభాగ్యమిడి ♦ వర్ధిలజేయుమ శ్రీసరస్వతీ!16

చ. వ్రతములుసేయలేను నుప ♦ వాసములైననుసల్పలేను నా
దృతిజపమైననున్ సరిగ ♦ దీక్షగాంచి తదేకనిష్ఠతో
మతినిలబెట్టిచేసెనక్ర♦మంబెఱుగన్ నినుమాత్రమెంతయున్
పతితముగానిచిత్తమున ♦ భక్తిగఁగొల్చెద శ్రీసరస్వతీ! 17

చ. సురుచిరవీణహస్తమున ♦ సొంపుగఁ బాలిచి నాల్గువేదముల్
వరలగమీటుచుంబరమ ♦ భక్తులపాలిటికల్పకంబవై
సరసిజగర్భసంభవుని ♦ స్వాంతనికేతనమందునిచ్చలున్
దిరముగసల్పితేజరిలు ♦ దేవి! కృపామతి! శ్రీసరస్వతీ! 18

ఉ. నీవమదీయదైవమని ♦ నెమ్మనిఁగొల్చెదసంతతంబు నీ
పావననామసంస్మరణ ♦ బాయనుతల్లి! యుపేక్షసేయకో
దేవి! దయాస్వరూపిణివి ♦ దీనను దోషములెంచకమ్మ సం
భావితమైననీచరణ ♦ పద్మముబట్టితి శ్రీసరస్వతీ! 19

ఉ. ఆయతమైనభక్తిని స ♦ మగ్రముగా భజియింతు నిన్ను దీ
ర్ఘాయువొసంగినాకెపుడ ♦ సంతసుఖంబు జయంబు లిచ్చి నీ
సాయము నాకొసంగి భవ ♦ సాగరమీవగఁ జేసి యాంపయిన్
శ్రేయముగాంచు సత్పదవి ♦ సిద్ధము చేయుము శ్రీసరస్వతీ! 20

చ. ఇరయనునామధేయమున ♦ నెల్లజగంబులు నిండి విద్యకున్
గురుపదమున్ వహించు నినుఁ ♦ గూర్మి భజించెద నెల్లవేళనా
దరమున నామవాక్కు-సను ♦ ధామఘనంబగు పద్యరాజముల్
వరలఁగ నీకటాక్షమును ♦ వర్ధిల జేయుము శ్రీసరస్వతీ! 21

ఉ. తెల్లనిచీరగట్టి కడుఁ ♦ దేజముతుం పెసలాడుపీఠముం
దల్లముపల్లవింప స్వర ♦ యోగమనోహరవీణమీటుచుఙ్
ఫుల్లసరోజనేత్రములు ♦ పూర్ణకృపారసముఙ్ వెలార్చునో
పల్లవపాణి! కొల్చెదభ ♦ వత్పదయుగ్మము శ్రీసరస్వతీ!22

చ. తెలియుచుధ్యానయోగములు ♦ దెల్లముగాజపహోమతత్వముఙ్
దెలియదుమంత్రశాస్త్రములు ♦ దివ్యములైనతత్వదీయశక్తులఙ్
దెలియఁగనేర్పుచాలదిఁక ♦ దీనజనాశ్రిత దిక్కుగీవిఁకఙ్
నెలతరో! నిన్నుజేరితిని ♦ నీవెటుచూచెదో శ్రీసరస్వతీ!23

శ్రీసరస్వతీశతకము.

చ, ఎఱుఁగక చేయుతప్పులను • నెంతయు లెక్కనుసేయబోక నా
కెఱుఁగఁగఁ జెప్పుమా యలుగ • కీవు వచించినరీతి భక్తిమై
నిరతము చేయుచుందుదగు • నేరుపుమించెడిశక్తినిమ్ము నే
సిరులను గోరఁ శాంతగుణ • సిద్ధిని గోరెద శ్రీసరస్వతీ! 24

చ. సతతము నీపదాంబుజము • సన్నుతి జేసెద భక్తిపెంపునన్
సుతలొనరించుతప్పులను • జూడరు తల్లులు వేఱుభంగిగా
పతితనటంచుమార్గ్గము • పట్టక జ్ఞానపథంబు జూపి స
మ్మతమగు రీతి గావుమిఁక • మాటికి వేడితి శ్రీసరస్వతీ! 25

ఉ. దోసములెంచిచూడకుము ♦ సద్గుణపుంజమునాభవంబుకై
వేసటజెందినీమరుగు ♦ వేగముజొచ్చితిచారునేత్రి! సం
తోసముమీరవత్సలత♦తోదరిఁజేరితి శారదాంబ! నీ
దాసికలందునన్ గలిపి ♦ ధైర్యముగూర్పుమశ్రీసరస్వతీ! 26

చ. విమలమతిన్ వహించి యర♦విందదళాయితలోచనా! సదా
ప్రమదమెలర్పగొల్చెదన ♦ వశ్యముతోఁకపుభక్తిగాంచి పెం
పమరగచిరాయురున్నతుల♦నందఁగఁజేయుము మేలుగొల్చుచున్
గోమరులనేలినాపతికి ♦ గూర్పుమక్షేమము శ్రీసరస్వతీ! 27

ఉ. తప్పులుచేసినాననుచు ♦ తథ్యముగావచియించినన్ సరున్
దప్పచరించితంచునిటు ♦ దండనసేయుటపాడియౌనె? నే
ర్పొప్పంగజెప్పరాదొకొ? హి♦తోక్తులజెప్పిన జేయకుందునే?
యొప్పగులీలయోజనని! ♦యోమునిపూజిత! యోసరస్వతీ!

ఉ. తల్లివిగాననీమనసు ♦ తాలిమిజెందకబోమనిక్క-మే
యెల్లవిధంబులన్ సుతుల ♦ నేలుటనీకునుధర్మమౌను సం
పల్లలితాంగి! కుత్సితుల♦పత్యములుందురుగానియెందునున్
తల్లులుకుత్సితంబెపుడు ♦ దాల్చుటసత్యము శ్రీసరస్వతీ!29

చ. ఋతమగువాక్కు నాలుకప ♦ యిఁ దగనిల్పి వివేకశీలముల్
చతురతశాంతిదాంతియును ♦ సాధుగుణంబును దారబుద్ధి స
మ్మతమగునీతిమార్గమును ♦ మానక నాకు నొసంగి నిత్యముఁ
క్షితిప ముకౌతుకంబెసఁగ ♦ క్షేమము గూర్పుమ శ్రీసరస్వతీ! 30

ఉ. పున్నము సేయలేదు పలు ♦ భూములు జుట్టియుఁ దీర్థకోటిలో
తిన్నగ గుంకలేదు పర ♦ దేవిప్రసాదమునందలేదు నే
పిన్నను దానధర్మములు ♦ పెద్దలసేవలు చేయలేదు నిఁ
సన్నుతి జేయఁబూనితిని ♦ శారద! నీదయ శ్రీసరస్వతీ! 31

చ. భవము తలంచి చూచుతఱి ♦ పాపపుకర్మలు పెక్కులై పున
ర్భవసవమైత మోహగుణ ♦ ణంబులకాస్పదమైన పుణ్యముల్
లవమును జేయలేక ఫల ♦ లాభములొందక కాలమెల్లనో
కువలయలోచనా! చెడితి ♦ కోర్కెలు గూర్పుము శ్రీసరస్వతీ!

ఉ. దేహము వీడిపోవుతఱి ♦ దీరనిరోగముచేత ఖిన్నునై
గేహమునందు బంధువులు ♦ కేకలు పెట్టఁగ నార్తచిత్తునై
యూహ కలంగి నీభజన ♦ యొప్పఁగ సేయఁగ నోపనో కదా? వ్యా
మోహము బాపి నీభజన ♦ ముఁ దయచేయుము శ్రీసరస్వతీ! ౪౩

చ. గళమున శ్లేష్మవాతములు ♦ గ్రమ్మి శరీరము పోవునప్పు డే
సలలితనామరూపములు ♦ సంస్మరణంబొనరించు నేర్పునన్
బలము రహింపఁబోవదు భ♦వచ్చరణాంబురుహంబు లిప్పుడే
కొలిచెడి భాగ్యమిచ్చినను ♦ గూరిమి నేలుము శ్రీసరస్వతీ! 34

చ. సనకసనందనాది ముని ♦ సత్తములైనను భక్తిగాంచియే
జననిశరణ్యయంచు పద♦సారసముల్ భజియింత్రు మోక్షమున్
గనుటకు నట్టితల్లిని య♦నారతమున్ భజియింతు నిన్నెదన్
వినయవివేకభావములు ♦ నెమ్మది దాలిచి శ్రీసరస్వతీ! 35

ఉ. దీనజనావనామిగుల ♦ దిక్కటినేనినువేఁడుకొంటి నా
మానససరాజకీరమును ♦ మానకనీపదపంజరంబునన్
పూనికమీఱనీక్షణము ♦ పొందికగావసియింపజేయుమా
చానను మంచిచెడ్డలవి ♦ చక్షణనేరను శ్రీసరస్వతీ! 36

ఉ. అస్థిరమైనదేహమిది ♦ యాకలిదప్పులకోర్వలేదు చ
ర్మాస్థులు రక్తమాంసముల ♦ నాయతమైనదిశైశవంబు బా
ల్యస్థవిరాదిపాత్రియముల ♦ నారటబెట్టుచునీనిసమ్మ స
త్వస్థితిగానలేనువరం ♦ దాయి! కృపన్‌గను శ్రీసరస్వతీ! 37

శ్రీసరస్వతీశతకము.

శా. శ్రీకరమైనసద్యశము ♦ చేతనరారుచు నిందునందునన్
ప్రాకుడులేనిజీవితము ♦ నన్ సుఖసంపదఁగాంచనెంచు బల్
ప్రాకటభక్తియుక్తిదన ♦ రన్ సతమెంతయుశ్రద్ధబూనుచున్
సాకిభజించుమానవుల ♦ జన్మముజన్మము శ్రీసరస్వతీ! 38

ఉ. సారమతిన్ దలంచినిను ♦ సంస్తుతిజేసినమూఁడుప్రొద్దులన్
జేకుఁజిరాయురున్నతులు ♦ శిష్టజనస్తవనీయబుద్ధి సం
సారసుఖంబులున్ గలుగు ♦ జ్ఞానముగల్గును నిత్యమోక్షల
క్ష్మీస్మరతీగల్గుసద్యశము ♦ చేకురునెప్పుడు శ్రీసరస్వతీ! 39

# శ్రీసరస్వతీశతకము.

చ. అనవరతంబు మోహమున ♦ కాస్పదమైన భవాబ్ధిఁజిక్కి నే
వినయవిధేయతాగుణము ♦ వీడి మోహమయత్వమందు పూ
నిన మతిచేత దివ్యమగు ♦ నీపదచింత నొకింత లేక నా
జననము వీటఁబుచ్చితిని ♦ శారద! బ్రోవుము శ్రీసరస్వతీ! 40

ఉ. అక్షయమైన నీపదము ♦ నందఁగఁగోరితి హంసగామినీ!
యక్షరమూర్తి నిన్నుగొని ♦ యాడఁగ నాతరమా నే? సత్యవే
దాక్షరపంక్తులే మహిమ ♦ సంతయుఁ దెల్పఁగఁజాలదయ్యెగా
సాక్షివి సర్వలోకముల ♦ సత్కళఁ దేలెదు శ్రీసరస్వతీ! 41

ఉ. ఆ యువు కొంచము న్యోను త ♦ దర్ధము రాత్రులయందు నిద్రలో
బోయెన హాంబు సర్వమును ♦ బూని ధనార్జనమందు బుచ్చుచున్
న్యాయపథంబు దప్పివిష ♦ యాబ్ధి మునుంగుచు నింత కాలమున్
వేయివిధంబులన్ జెఱతి ♦ నీదయ గోరితి శ్రీసరస్వతీ! 42

ఉ. ఆదరమింత జూపదగ ♦ దా? నిను నింత గగొల్చుచుండగా
నీదు కృపాప్తి గోరితిని ♦ నీవ సమస్త మటంచు నమ్మితిన్
మోదపయోధి దేల్పగల ♦ మూర్తివటంచు భజించుచుంటి నీ
శ్రీదయివారబోసి ప్రముప్ర ♦ సిద్ధగుణమ్మున శ్రీసరస్వతీ! 43

చ. సలలితతేజముఁ బడసి ♦ చక్రనిరూపును దాల్చి భక్తకో
టుల కెనలేనిభాగ్యముల ♦ నుంగను గూర్చి సుఖింపఁ జేయుచుఁ
బలము నొసంగి ప్రోచుగుణ ♦ భద్రనుతల్లిని నెమ్మనమ్మునఁ
గొలుతు మదీయపాపములు ♦ గొబ్బునఁ గూల్చవె శ్రీసరస్వతీ! 44

ఉ. నీమహిమంబు లేక ధర ♦ నెంబ్రతుకంగలశక్తి యున్నదే?
యేమియొనర్పనేర్తు కృప ♦ నీవు నన్నుఁ దగఁ బ్రోవకుండినన్
నీమముతో భజించెదను ♦ నీవు మదర్థము ప్రేమమించు వే
నీమది నెంచి ప్రోవుమవ ♦ నిన్ సుఖమొందఁగ శ్రీసరస్వతీ! 45

చ. కుజనులతోడి నెయ్యములు ♦ గూర్పక నెప్పుడు చిత్తవృత్తులన్
సుజనులు బోవుమార్గమున ♦ జొన్పడ జేసి త్వదీయ నామముల్
భజనమొనర్పగాదగిన ♦ భక్తియు శక్తియు నిచ్చి నాకు యా
ర్యజనులు మెచ్చువాక్కుతన ♦ రారగజేయుమ శ్రీసరస్వతీ! 46

చ వలనుగ నీస్వరూపములు ♦ వర్ణన సేయఁగలేక తల్లి ప్రాఁ
బలుకులు నిర్జరాళియును ♦ ప్రాజ్ఞశిరోమణులుండ వారితోఁ
నలుసున కైన నన్గడగని ♦ నాకుదరంబె త్వదీయతత్వముల్
పొలుపుగ కీర్తి సేయుటకు ♦ పుష్కరలోచన! శ్రీసరస్వతీ! 47

చ. భగవతి! సత్యలోకమున ♦ బ్రహ్మసమేతముగావసించి యె
ల్లగతులభక్తకోటులుచె ♦ లంగవరంబులనిచ్చిప్రోచుచుఀ
జిగురులమించుకేలుగవ ♦ చేనొకవీణియబట్టిమీటుచుఀ
మొగమునచిన్నినవ్వలర ♦ మోదమొసంగుమ శ్రీసరస్వతీ! 48

చ. కనుగవమోడ్చినీచరణ ♦ కంజములఀ స్మరియించువేళ నా
మనముచలించుచుఀ గలఁగి ♦ మాటికిమాటికిక్షోభమొందఁగా
జనితతమఃప్రభావమున ♦ శారద! నీభజనంబునిల్పదో
జనని! ముదంబుతోనపుడు ♦ చెలగఁజూడుమ శ్రీసరస్వతీ! 49

ఉ. ప్రాణము వోవు వేళలను ♦ బంధులు పుత్రులు మిత్రులందఱున్
బానుచు మూగి చిత్తమును ♦ బగ్గిగ గల్పుదురంతె కాని వి
జ్ఞానముతో డనీశ్వరుని ♦ సన్నుతి చేయు పదాళి నిచ్చి స
న్నెనెబు భక్తిఁ గొల్చినను ♦ దృష్టి ఘటిల్లదు శ్రీసరస్వతీ! 50

చ. గళమున ప్రాణవాయువులు ♦ గల్గినదాక నె బంధులాప్తులున్
పలపలమూగుచుండ్రు బహు♦భంగుల ప్రాణముపోవునాపయిన్
మెలకువగాంచి మొక్కకరు ♦ మెల్లగ వీడుదు రీవొ కష్టముల్
గలిగినయప్పుడే దయను ♦ గాంచెద వెంతయు శ్రీసరస్వతీ!51

ఉ. నిన్నె భజింతు నెల్లపుడు ♦ నేర్పలరార గభక్తిపెంపుతో
నెన్నుదు సర్వకాలముల ♦ నీవ శరణ్యమటంచు భాషయం
దున్న విశేషముల్ మృదుమహా ♦ తోక్తుల దెల్పిన పుణ్యరాసినే
నెన్నియుగాలనైన భజి ♦ యించెద మద్గురు శ్రీసరస్వతీ! 52

చ. సదమలభావముల్ గలుగు ♦ సత్యపథమ్మున బోవునట్లుగా
హృదయమునందు నెట్టుదల ♦ పింతువొ భక్తిమెయిన్ భజింతు నీ
పదములబట్టితిన్ గృపకు ♦ బాత్రనుగా నొనరింపుమిప్డె నే
ర్పొదవెను లీల బ్రోచిదయ ♦ యుంచుము నాపయి శ్రీసరస్వతీ! 53

చ. తనయుఁడొసంగుచేసినను ♦ తల్లిక్షమించికృపన్ వహించు న
ట్లనయము నేనొనర్చునను ♦ లందునఁగల్గుదోసంగులన్ క్షమిం
చినయుపథంబునన్ జనెను ♦ చెల్వగుబుద్ధులు సెప్పి మంచితో
వనుజనునట్లుతోడ్పడుమ ♦ భద్రము గాంతును శ్రీసరస్వతీ! 54

చ విలసితమైనఫాలమున ♦ వేడుకమీరఁగకమ్మవజ్రపుం
తిలకముదిద్దికన్నులకు ♦ తీరుగ కాటుకఁ బెట్టియందమా
వెలగలయాణిముత్యముల ♦ పేరులురంబున చౌకళింపగా
పలుకు వెలంది! నీముఖము ♦ భావనజేసెద శ్రీసరస్వతీ! 56

చ. తొళసిదళంబుతో నెపుడు ♦ తోరపుభక్తిని మూడుపొద్దులన్
దలచి త్వదీయరూపమును ♦ తప్పక పూజయొనర్తు తప్పులన్
దలపక జ్ఞానమార్గమును ♦ తార్కొనజేయుము నాదుచిత్తమున్
కలవరమందిసద్గతిని ♦ గానక క్రుక్కితి శ్రీసరస్వతీ! 56

ఉ. నీదయ లేనిజీవిత ము ♦ నేకదినంబులు దాల్చియుండెనన్
ఖేదమునొందుటే ఫలము ♦ కీర్తిగడించుట లేమపిమ్మటన్
వాదము జెందబోదకట! ♦ మోక్షము దూరము శారదాంబనీ
పాదములందుసంస్మరణ ♦ బాయక నిల్పుము శ్రీసరస్వతీ! 57

ఉ. విద్యకు నాత్మభూమివయి ♦ విశ్వమునిండుచు నద్దపేర్మితో
విద్యయుఁ బుద్ధినిచ్చి కను ♦ వీతతమోగుణచిత్తపద్మతై
సద్యశముల్ విశేషగుణ ♦ సంపదలందఁగ మానవాళికిన్
వేద్యవిధానముల్ దెలుపు ♦ వేల్పని నమ్మితి శ్రీసరస్వతీ! 58

ఉ. వేకువ లేచి నీభజన ♦ వేడుక మీరఁగఁ జేతు నెమ్మదిన్
శ్రీకరమైన పుష్పముల ♦ నేకములన్ గొని తెచ్చి నిత్యమున్
ప్రాకి సభక్తితో జనని! ♦ భారతి! నా మొఱలాలకించి నీ
వేకరణిన్ మదీప్సితము ♦ లియ్యఁదలంచితో? శ్రీసరస్వతీ! 59

చ. పసితనమందునేరమిని ♦ పాపములెన్నియొ చేసిచేసినే
వ్యసనముజెందిజీవితము ♦ భారమునై కనుపట్టసంతటన్
విసువుజనించెచిత్తమున ♦ వేఱొకమార్గముదోచదయ్యె సా
రసభవురాణి! నన్నిపుడు ♦ రక్షణచేయుము శ్రీసరస్వతీ! 60

చ. స్థిరముగనీదుపాదముల ♦ చిత్తమునిల్పగలేను త్వత్పదాం
బురుహముగొల్చువారలకు ♦ పుట్టుటగిట్టుటలంతరించునో
సరసిజనేత్ర! వందనము ♦ సల్పెద కోర్కులదీర్పనీవెకా
మఱువకనీకటాక్షమొక ♦ మాటునిగుప్పుమ శ్రీసరస్వతీ! 61

ఉ. చింతలుగ్రొత్తలై వొడమి ♦ చేరగనీయుమసద్గుణాంబులన్
శాంతియుదాంతియున్ గలిగి ♦ సజ్జనసేవలుజేయబోదునే
దాంతవిచారభావముల ♦ తథ్యమెఱుంగదు నాదుచిత్తమా
సంతమసంబునందణగి ♦ సద్గతిగోరదు శ్రీసరస్వతీ! 62

ఉ. నీపయిభారమున్ వయిచి ♦ నెమ్మదిశాంతివహించి సత్యమే
ప్రాపయినన్నుబ్రోచునని ♦ భావమునన్ దలపోయుచుంటినే
పాపమెఱుంగనిన్నెపుడు ♦ భక్తిమెయిన్ భజియించుచుంటినీ
వేపగదాల్చినన్ పరులి ♦ కెవ్వరుబ్రోతురు శ్రీసరస్వతీ! 63

ఉ. దేవి! భవత్ప్రభావమున ♦ తెన్గునకైతము నేర్చితెంతయున్
శ్రీవిసయంబుగాంచుచుప్ర♦సిద్ధమతిన్ నినుగొల్చుబుద్ధియున్
భావమునందు నేర్చుపరి ♦ వర్తనమందు యశంబుగూర్చి సం
భావనజేసెదన్ సతము ♦ మానక గొల్చెద శ్రీసరస్వతీ! 64

ఉ. సంపదగల్గినప్పుడెద ♦ సంతసమందు విపత్తుగల్గినన్
బెంపువహింపబోదు మఱి ♦ ప్రేమదలిర్పసమత్వభావమే
యింపువహింప నెమ్మదని♦నేర్తు ననాటుము క్రోధబుద్ధియున్
జంపిపిశాలభావములు ♦ సమ్మతినిమ్మిఁక శ్రీసరస్వతీ! 65

చ. కొడుకులు సేయు దోసములు ♦ కూర్మిసహించెడు తల్లిదండ్రుల
ట్లెడదకృపారసంబు వహి ♦ యించి పరాంబిక! నా దోసంగులన్
తడవును సేయకే సయించి ♦ ధర్మనిధానమునందు జ్ఞానమున్
బడయఁగ నీయుమా సుకృత ♦ మార్గమునందగ శ్రీసరస్వతీ!

ఉ. నీవలనన్ గదా సతము ♦ నిత్యసుఖంబును గాంచుచుంటి సు
శ్రీవిభవంబులన్ వడసి ♦ చెన్నలరారయశంబు గాంచితిన్
దేవి! స్తుతించుచుంటి నెను ♦ దీయక నా యెడ దోసముండినన్
కావుమ నన్ క్షమించి కల ♦ కాలము నేచెద శ్రీసరస్వతీ! 67

చ. తెలిసియుకొన్ని తప్పులను ♦ తెల్వియొకింతయు లేక కొన్ని యుక్
బలగుణగర్వభారమున ♦ బాల్పడికొన్నియు బుద్ధిహీనతక్
సలిపితి పెక్కుదోషములు ♦ సమ్మతిబోర్వగ దేయటంచు న
ర్మిలి నిను మ్రొక్కుచుంటినను ♦ వేర్మిని జూడుమ శ్రీసరస్వతీ!

ఉ. మానక నీపదాబ్జములె ♦ మాటికి నమ్మి భజింతు నీకు సే
వానియమంబులక్ సలిపి ♦ భక్తిగనుంటిని దోషమున్న దే
వీ! ననుగూర్మి నేలవల ♦ దేః తగునా యిటు త్రోసివేయ న
జ్ఞానము వాపి శ్రేయము గు ♦ జ్ఞానమొసంగుము శ్రీసరస్వతీ! 69

ఉ. ఆయతభక్తిదాల్చియన ♦ యమ్మునినుఁ భజియించుచేసదా
శ్రేయమటంచుభర్తవిని ♦ చెఁపలుమారుపురాణగాథలా
ప్యాయనమైపఠించుసమ ♦ యంబుననాపతిభక్తిభావముల్
కాయమునుండుదాక విక ♦ లంబొనరింపకు శ్రీసరస్వతీ!70

చ సరసమతిఁ భజింతునిను ♦ స్వాంతమునందున భక్తిభావమే
మరకనిరంతరంబును స ♦ మంచితకీర్తిని పేర్మిమజూపుచుఁ
సిరులనువైభవోన్నతుల ♦ జెందఁగసౌఖ్యము గాంచునట్లుగా
వరమొకటిమ్మునాకుకోద ♦ వా?దయచేసిన శ్రీసరస్వతీ! 71

చ. జననమునీటిబుగ్గ ధన ♦ సంపదభోగము చంచలాభమౌ
తనువులనిత్యముల్ రుజలు ♦ దాఁకొనిచిందరవందరయ్యెడున్
తనయులు బంధుమిత్రములు ♦ తాఁజనువేళలవెంటరారుపా
వనమగునీదునామమునె ♦ పాటిగఁగొల్చెద శ్రీసరస్వతీ! 72

ఉ. లోకములోననెందుచప ♦ లుల్ నినుభక్తిభజింపఁజాలర
శోకముదంబుతోనెపుడు ♦ దోయిలిగూర్చెదహర్షచిత్తవై
చేకొనుమమ్మనాప్రణతి ♦ శ్రీగిరిజానతపల్లవాంఘ్రిసీ!
నీకృపజూపఁగావలెను ♦ వీడనునిన్నిఁక శ్రీసరస్వతీ! 73

ఉ. నీముఖమెప్పులోకజన ♦ నీముఖబింబము గేలిచేసెడిన్
నీమృదుమానసంబు నవ ♦ నీతసమానము నీదు [illegible]
సోమమరీచిజాలములు ♦ [illegible]
కాంతి [illegible] ♦ [illegible] 74

ఉ. నిన్నెదనమ్మియుండుటను ♦ నీరజనేత్ర! సుఖంబులందితిన్
మన్ననగాంచితిన్ ప్రభుల ♦ మాన్యతఁ బొందితి శ్రీయ మొందితిన్
గ్రన్ననభాగ్యసంపదల ♦ గాంచితి నేమియులోటులేదు సా
ఖ్యోన్నతినిచ్చి ప్రోవుమహిం ♦ తోక్తులఁ గూర్మిని శ్రీసరస్వతీ! 75

చ. దినదినముఁ క్షణక్షణము ♦ దేవనిగా నినుఁ గొల్చుచుంటి నే
మ్మనమున భక్తిభావములు ♦ మాటికిఁ పైనుబుకంగఁ జేసి కా
వున దయఁ దాల్చి నన్నెటులొ ♦ ప్రోవఁగ రాదె వరాంబికా! సుఖం
బున తులతూగి జీవితము ♦ బుచ్చెడి రీతిని శ్రీసరస్వతీ! 76

ఉ. చిన్ని కుమారులఁ సుఖము ♦ జెందఁగఁ జేసి మదీయ భర్తకుఁ
గ్రన్నన భాగ్యవైభవము ♦ గాంచఁగ నిచ్చి శుభప్రదమ్ముగా
నన్ను నయంబు బ్రోతువని ♦ నమ్మితి రూఢిగ నాత్మలోపలఁ
నన్నిక నేవిధమ్మునను ♦ నమ్ముదు నెంతువో శ్రీసరస్వతీ! 77

ఉ. అర్థముగోరికాదు ధన ♦ మన్నముకాంక్షజనించికామునిన్
ప్రార్థనజేయుటల్ దినము♦నందునరాత్రులయందుకాలమున్
వ్యర్థముగాకయుండునటు ♦ లర్థ్యబలమ్మును నాటఁజేసిలో
స్పర్థజనింపకుండుటకు ♦ సమ్మతిగొల్చెద శ్రీసరస్వతీ! 78

ఉ. నీకృపపెంపునన్ గడగ ♦ గాంచితిదెన్గునకైతమింక సు
శ్రీకమనీయమూర్తులగు ♦ చిన్నికుమారులుగల్గిరెప్పుడున్
నాకునుదైవమట్లుపతి ♦ నవ్యసుఖంబులుగూర్చుచుండెడిన్
నీకెపుడున్ నమస్కృతుల ♦ నేకముచేసెద శ్రీసరస్వతీ! 79

చ. సకలము నీవయంచు వెలు ♦ చఁగ మృదుభావమునన్ భజింతు నే
వికలముగాని చిత్తమున ♦ వెండియు భక్తిమతిన్ ద్వదీయమూ
ర్తికి గుణరాసికిన్ విమల ♦ తేజము దాల్చిన ధర్మమూర్తికె
పుష్కరము మోడ్చెదన్ గృపను ♦ బ్రోవుము సన్నిక శ్రీసరస్వతీ!

ఉ. చెప్పెడిదేమి నీకు సర ♦ సీరుహలోచన! నాదొసంగులన్
దప్పక సైచి ప్రోవుమిఁక ♦ త్వత్పదయుగ్మము గొల్చువాఁడ నే
రొప్పమనంబునందు దయ ♦ యూనుచు బుత్రికవోలెఁ జూడుమా
యెప్పటికైన నీవ భరి ♦ యింపవలెన్ జుమ శ్రీసరస్వతీ! 81

ఉ. నన్నెటునుద్ధరించెదవొ ♦ నాపతినేవిధినాదరింతువో
యున్నచునుందునీదయనె ♦ యీతనువుండెడిసంతదాక నా
విన్నపమాలకించి కురి ♦ పింపుమ నీమకృపామృతంబులన్
నిన్నుత్యజించివేఱొకరి ♦ నింభజియింపను శ్రీసరస్వతీ! 82

ఉ. నాపయినన్ గృపారసము ♦ నాటెదవన్నతలంపుతోడ నీ
ప్రాపుగణింపఁగాగలుగు ♦ భావమునన్ గొనియాడుచుంటినే
పాపముజేసినాననుచు ♦ భారతి! గోపములేకపేర్మిమై
జూపుమసత్కృపన్ నుదురు ♦ సోఁకఁగమ్రొక్కెద శ్రీసరస్వతీ!

ఉ. భావమునందు నీచరణ ♦ పద్మము దక్కఁ మఱేది యేని నే
భావనఁ జేయనొల్లనిది ♦ భావ్యము నీకు నెఱుంగఁ జెప్పితిన్
నీవ మదీయ దేవతవు ♦ నీపదదిష్టము గూర్చుమమ్మ సాం
పాపహిం లంగఁ బ్రోవఁ దగ ♦ దా? బరువా నొకో? శ్రీసరస్వతీ!

చ. నిలచి ప్రణామముల్ సలిపి ♦ నెమ్మది సమ్మద మిన్మడింపదో
యిలిసుటి యుంచి భక్తిమెయి ♦ నెంతయు సంస్తుతి జేసి చేసి మొ
ఱ్ఱలిడితి నామనంబునను ♦ గోరిక తెల్పియు లేవు నీపదం
బులు మదిలోన నిల్పు దృఢ ♦ బుద్ధిగ నంపుము శ్రీసరస్వతీ! 85

చ. పరివడిపాపకార్యముల ♦ పై మనముం బురికొల్పబోకుమే
యనువున నైన నీపదము ♦ లంచితరీతిని కొల్వలేదటం
చనిశము నేడ్చుచుంటినిక ♦ టా! తెరువెద్దియు లేదు నాపయిం
కనికరముం వహించివెస ♦ గావదలంపుము శ్రీసరస్వతీ! 86

చ. మనమున సద్గురూత్తముని ♦ మానకపూజలు సేయుచుంటినా
జననికి మ్రొక్కుచుంటి సల ♦ సాధుచరిత్రుల గొల్చుచుంటినే
ననయము భర్తృపాదము స ♦ మంచితరీతి భజించుచుంటిగా
వున నపరాధముల్ సయిచి ♦ ప్రోవుమ యెప్పుడు శ్రీసరస్వతీ! 87

ఉ. వారకగొల్చుచుంటినిను♦స్వాంతమునన్ గలభక్తిపెంపునన్
కోరికదీర్చిభద్రములు♦కూర్చియనుగ్రహముంచియెప్పుడున్
తీరనిసౌఖ్యమిచ్చివెలి ♦ తిన్ గననీయక నీదుసత్కృపా
సారమునాపయిన్ జిలికి ♦ చక్కగ ప్రోవుమ శ్రీసరస్వతీ! 88

ఉ. ప్రేమరసంబులుట్టిపడ ♦ పేర్మినిగాంచుచు జ్ఞానసంపదన్
నీమహిమంబులన్ దెలిపి♦నెయ్యముతియ్యముమీరునట్లునా
పైముదమున్ వహించితగు ♦ పద్ధతులన్నియుబోధసేయరా
దా? మహితప్రబోధమున ♦ తద్దయుగొల్తును శ్రీసరస్వతీ! 89

ఉ. నీకృప పెంపు నాయెడల ♦ నిశ్చయమై తనరారుచుండ నే
ప్రకటసౌఖ్యసంపదల ♦ భవ్యశుభంబులనొందుచుందులో
కైక కృపావలంబ! భవ♦దంఘ్రియుగంబును గొల్చువారికే
లాకొజతల్ ఘటిల్లుకమ ♦ లాసను ప్రేయసి! శ్రీసరస్వతీ! 90

ఉ. కోరి భజింతునిన్నెపుడు ♦ కోరిక లీరిక లెత్తనాత్మలో
జేరగదీసి ప్రోచుటకు ♦ చెల్లదె? సేవకురాలనైతి సం
సారమునందు జిక్కుకొని ♦ సంకటమందితినీదు పాదముల్
సారెకు సన్నుతించెదను ♦ జాలిదలంచుమ శ్రీసరస్వతీ! 91

చ. శ్రితజనకల్పవల్లివని ♦ చేరితినీదరికన్నతల్లి! స
మ్మతముగురీతిగాభ్రమను ♦ మానసము పెంచక చింతవాపి స
ద్గతిబడయంగఁ జేయవె యు♦దారగుణాఢ్య! మరాళగామినీ!
సతతముదోసిలొగ్గినిను ♦ సంస్తుతిఁ జేసెద శ్రీసరస్వతీ! 92

ఉ. శారదచంద్రికాధవళ ♦ సన్నుతగాత్ర! కురంగనేత్ర! నీ
హారసముజ్జ్వలస్ఫటిక ♦ హారకరాంకుశపాశవల్లకీ
ధారిణి! దీనపోషణి! సు ♦ ధారసభాషిణి! నిత్యతోషిణీ!
శారద! నీదుపాదముల ♦ సన్నుతిచేసెద శ్రీసరస్వతీ! 93

ఉ. అంబ! సితాంబుజాసని! ద♦యాంబుధి! పద్మజరాణి! వాణి! ధ
ర్మాంబిక! నారదాదివిబు♦ధాళిసమర్చిత! సారసాంఘ్రి! నే
రంబులసై పుసీపదప ♦ రాగమెదిక్కిఁక నీకృపావిశే
షంబునుజూపికావుమిఁక ♦ సంసృతికష్టము శ్రీసరస్వతీ! 94

చ. సకలకలాస్వరూపిణి! ప్ర ♦ సన్నవిలోచన! భక్తరంజనీ!
సకలచరాచరంబులకు ♦ సాక్షివికోవిదకల్పవల్లి! తా
వకపదభక్తిచేసకల ♦ వాంఛితముల్ బడయంగవచ్చుత
ప్పకవరమీయకున్న పెర ♦ వారలులేరెక శ్రీసరస్వతీ! 95

ఉ. అమ్మ! నవాబ్జపాణి! శుభ ♦ మందగ సత్కృపజూపవమ్మ! ని
న్నెమ్మదిగొల్తునమ్మ! కరు ♦ ణింపుము నీసరివారు లేరు స
త్యమ్ముగ నమ్మినాను బహు ♦ భాగము పొందితి! బ్రోవుమమ్మ! నాకు ని
త్యమ్ము సుభద్రమిమ్మ! కమ ♦ లాసనుభామిని! శ్రీసరస్వతీ! 96

చ. శరణము పూర్ణచంద్రముఖి! ♦ సర్వకళాకలితస్వరూపిణీ!
శరణము సర్వలోకనుత! ♦ సద్గుణవల్లి! మరాళగామినీ!
శరణము నారదాదిబుధ ♦ సన్నుత! పలుకులకల్కి! భారతీ!
శరణము పద్మహాసి! సిత ♦ సారసవాసిని! శ్రీసరస్వతీ! 97

చ. జయజయబ్రహ్మరాణి! భవ ♦ సంహరి! చారుకురంగలోచనా!
జయజయమంజుభాషిణి! ల ♦ సన్మణిభూషణి! లోకతోషణీ!
జయజయభోగభాగ్యసుఖ ♦ సద్గుణదాయిఖిలైకపావనీ!
జయజయవాక్సతీ! లలిత! ♦ శర్మద! భారతి! శ్రీసరస్వతీ! 98

చ. తెలుగుకవిత్వముం సరిగ ♦ దీక్షచింపఁగ సర్వ హైమాగ్యరేక్
గలుఁగఁగఁ జేసిభావములు ♦ కాంతివహించి వికాసమొందఁగా
జిలిబిలిముద్దుపల్కులను ♦ జిమ్మనుభాగ్యమునిచ్చిప్రోవఁగా
నలికులవేణి! నాహృదయ ♦ మందువసింపుము శ్రీసరస్వతీ!

ఉ. నీమృదుపాదపద్మముల ♦ నెమ్మదిఁ దాల్చితినీస్వరూప వి
ద్యామహితప్రచారముల ♦ నర్చనచేసితినిన్నుఁబోలె సు
శ్రీమహిమంబులొప్పనొక ♦ చెల్వనుసందియమేటికింకనీ
నామమెదాల్తు; నీకృపకు ♦ నాకొకలోపమె శ్రీసరస్వతీ! 100

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



